శ్రీ







ఆంధ్రీకృత

# భగవద్యామునాచార్య స్తోత్రరత్నము

ఇది

శ్రీమన్మంగళగిరి క్షేత్రవాసుఁడును బ్రస్తుతము
గుంటూరుజిల్లా కలెక్టరాఫీసులో లేఖకుఁడనగు
గొట్టుముక్కల రమాకాంతాచార్యులిచే
రచింపఁబడి.

గురిజాల తాలూకా అడిగొప్పుల అగ్రహారికులగు
శ్రీమద్విశిష్టాద్వైత ప్రథమదిగ్గజాచార్య
సమయోద్దండ కోలాహల
శ్రీమాన్ పరవస్తు అప్పంగారిస్వామ్యయ్యవార్లంగారిచేఁ
బరిష్కరింపంబడి,

బాపట్లలోని శ్రీ భారతీవిలాస ముద్రాక్షరశాలాధ్యక్షు
లగు బ్ర॥ భట్టిప్రోలు సుబ్బారావుగారిచే ముద్రింపఁబడి,
నూజవీడుతాలూకా తెంపల్లిగ్రామ మొఖాసాదారు
శ్రీమాన్ నంబూరి పార్థసారధిగారిచేఁ
బ్రకటింపఁబడియె.

బాపట్ల.

1909

మొదటికూర్పు 500 | కాపీరైట్. | వెల 2 అణాలు

# పీఠిక.




పరమభాగవతోత్తములగు నార్యులారా!

భగవంతుండగు నారాయణుండు సంకల్పమాత్రంబునం జరాచరాత్మకంబగు నసంఖ్యాకబ్రహ్మాండముల సృష్టింపగ, యందనాదికర్మవాసనా బద్ధులై, జననమరణరూప సంసారప్రవాహంబునంబడి దరిం గానక పొరలెడుచేతనకోటి నుద్ధరింపనెంచి నిర్హేతుకజాయమాన కరుణావిశేషంబునం గరణకళేబరంబులతోం బాటు వేదశాస్త్రరూప జ్ఞానసాధనంబులవారికి బ్రసాదించెం. కాని, మందబద్ధులగు జీవులు తత్సాధనసాహాయ్యంబుగలిగియుండియుం దరింపంజాలరైరి. దానం జేసి పరమకారుణికుండగు శ్రియఃపతి యప్పుడప్పుడు. తదీయులగు ననంతాదుల నిజాంశవిశేషంబున భూలోకంబున నవతరింపంజేసి చేతనకోటి మోక్షోన్ముఖులం గావించుచుండు అట్టి యవతారంబులలో నొక్కరగు భగవద్యామునాచార్యులు కలియుగంబున 4017 వది యగు ధాతునామసంవత్సరములో నాషాఢ పూర్ణిమా బుధవారమున నుత్తరాషాఢ నక్షత్రమం దవతరించిరి. అనంగా వీరిజననము క్రీస్తు శకాబ్దము 916 సంవత్సరమని చెప్పవచ్చును. వీరి తండ్రిగారు ఈశ్వరమునులు. తాతగారు నాథమునులు. శ్రీభాష్యమును రచించి విశిష్టాద్వైత సిద్ధాంతమును స్థాపించి లోకమందా బాలగోపాలమునకును శ్రీమన్నారాయణాష్టాక్షరీ మంత్రమునుం గాంచీపురగోపురాగ్రమునుండి వెదంజల్లి జీవదయాపరుండని కీర్తిం గాంచిన శ్రీభగవద్రామానుజాచార్యులవారు వీరిచరమదశకుం బిన్నవయస్సులోనుండి వీరిని సేవింపవలెనని శ్రీరంగమునకు వచ్చునంతలో నాయన పరమపదించిరి. వీరిరువురునుం గలియలేదు. భగవద్యామునాచార్యులవారు గీతార్థసంగ్రహమును నీస్తోత్రరత్నంబును రచించిరి. ఈస్తో

త్రిరత్నము పనిషదర్థ ప్రతిపాదకమై వేదాంతదేశికులవారిచే వ్యాఖ్య వ్రాయఁబడి విశిష్టాద్వైత సిద్ధాంతమునకు బీజప్రాయమై వెలయుచున్నది. భగవద్రామానుజాచార్యులవారు రచించిన గద్యత్రయము పరిశీలించినచో నందు యామునాచార్యుల శ్రీసూక్తియే యచటచట వాడఁబడి యున్నది. ఇదిచూచిన నుడయవరునకు నాళువందారునందుఁగల మహాగౌరవము వెల్లడి యగుచున్నది.

2. ఇట్టి మహాగ్రంథముఁ దెనిఁగించుటకు నేను సమర్థుఁడఁగానని యెఱింగియు, తత్పఠనానుభవజనిత సమ్మోదమునఁ గలిగిన బుద్ధిచాపల్యము నాఁపుకొనఁజాలక తెనిఁగించినందునకుఁ బెద్దలు క్షమింతురుగాక! ఈ గ్రంథీకరణమునఁగల దోషములను నాకుఁ గనఁబఱిచినచో దిద్దుకొన సిద్ధముగా నున్నాఁడను.

3. మ. జలజాక్షాంఘ్రిరతుండు తెంపలి మొఖాసాదారునఁ డూరిస
తుల్కలసీతాపతి గారిపుత్రకుఁడు సంస్తుత్యైకదానవ్రతో
జ్జ్వలహస్తుఁ డగు పార్థసారథిమదార్యేంద్రాజ్ఞస్తోత్రంబు ఖ
ర్వ్యలభారంబును నిర్వహించుమనుసచ్ఛ్రేత్రించెసద్భక్తితోన్

ఇట్లు,

గుంటూరు
27-9-09.

విబుధవైష్ణవవిధేయుఁడు
గొట్టుముక్కల రమాకాంతాచార్యులు

## శుద్ధపత్రిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 28 | పీడకొల్ | పీడయుల్ |
| 5 | 6 | మవసు | నమసు |
| 7 | 6 | శముల్ | శయులకి |



శ్రీమతే రామానుజాయ నమః

ఆంధ్రీకృత

# భగవద్యామునాచార్య

# స్తోత్రరత్నము.



కృతిపతి.

ఉ. శ్రీనిగమాంతపుష్పక పరీమళవాసిత కంఠదేశ! క
ల్యాణ గుణప్రకాశ! మహితార్థరసోదిత దివ్యవాగ్ఝరీ
మానితవీచికా ఘుమఘుమంఘుమనాదరట త్సుధీర! శో
భానిధీ! శ్రీనివాస ప్రతివాది భయంకర దేశికాగ్రణీ. 1

క. ఇలమంగళగిరిపతికిన్, బలిదంష్ట్రిలకెఱఁగి, యామునస్తోత్రంబున్
తెలిఁగింపఁబూనితిని, సత్కృతినిన్ దయఁజూచి, యవధరింపుము దేవా

యామునస్తుతి.

మ. ధరలోఁగల్గు సమస్తచేతనులు తత్త్వజ్ఞాన సంపూర్ణులై
తెరియింపన్, స్తుతిరూప వాక్యములఁ దద్గంభీర వేదాంత ది
వ్యరహస్యార్థ సుధాప్రసారింబులనె నవ్వాఁడట్టి యోగీంద్ర శే
ఖరు, శ్రీయామున దేశికుం దలఁతుఁ దత్కారుణ్యగాఢస్మృతిన్. 3

## స్తోత్రరత్నము.

క. పరమాచింత్యాద్భుతసుఖ। భరితజ్ఞాన ప్రకృష్టవైరాగ్యనిధిన్
స్ఫురితాగాధాచ్యుతభ। క్తిరసాంబుధి,నాథమునికిఁ గేలుమొగుడ్తున్. 4

మ. మధుజిత్పాద సరోజతత్వదృఢ సమ్యగ్జ్ఞాన భక్తిప్రభా
వధురీణత్వ కథాంతసీముఁ డెవఁడే బ్రహ్మాణ్యపాదాబ్జముల్
గ్రథితాస్మచ్ఛరణంబులౌ నెపుడు లీలా నిత్యభూతిద్వయిన్
బ్రథితాస్మత్పతి యెవ్వఁడట్టిముని నారాధింతు నాథార్యునిన్. 5

మ. ధరపై, నచ్యుతభక్తి సంకలిత తత్వజ్ఞాన పీయూషసా
గర వేలాపరివాహరూప శుభవాక్పారంపరిన్ బూనెమున్
బరమార్థంబగు భక్తియోగ, మవతీర్ణంబయ్యెనే యోగిచే
గురుచే, నాయనకుంబునర్నమనముల్ గావింతు నాథర్షికిన్. 6

చ. అరయఁగ భోగమోక్ష తదుపాయగతుల్, చిదచిత్పరాత్పరాం
తరగత తత్స్వభావములు ,తత్వగతిన్ వివరించి తెల్పఁగన్
బరమపురాణరత్నముఁ గృపామతినైన రచియించెనే గుణా
త్తరుఁడల శ్రీపరాశరుని దాసుని(గూర్చి నమస్కరించెదన్. 7

ఉ. అనిశము నెద్ది మత్కులము నంచలివారికిఁ, దల్లిదండ్రులున్
వనితలుఁ, బుత్రులున్ ,సకల వైభవజాలము,నయ్యెనట్టిమ
ద్వనతరగోత్రనాథుఁడు మదాద్యగురూత్తముఁడైన, శ్రీవివ
ర్ధన వకుళాభిరాము,పద తామరసద్వయి,మూర్ధ దాల్చెదన్. 8
పరిణతాస్మచ్ఛిరమందు, నైగమశిరోభాగంబున,ందెద్దిపా
వనమై శోభిలు, మన్మనోరథ పథవ్రాతంబు పాలించుదే
నిని, మాకుం గులదైవతంబు, కులపున్ నిక్షేపమౌ, నెద్ది,య
వ్వనజాతాక్ష పదారవిందమును సంభావింతుఁ జిత్తంబునన్. 9

చ. వనజభవాభవాది సురపంక్తికిఁ బూర్ణముగా నెఱుంగనె
వ్వని మహిమాబ్ధిశీకరల వంబును శక్యముగాదొ, యట్టిమా

శుని మహిమంబులన్ బొగడఁ, జొచ్చితి సిగ్గునుబొంద; కిట్లొన
ర్చిన కవినైననాకు నొనరించుకొనందగుమన్న మస్కృతిన్. 10

మ. అతులయ్యున్, మతిచుల్పబుద్ధినగునే, నత్యంతమున్, సన్నుతి
చ్చటఁ గీర్తింపుదుఁజూ, యథామతి, యథాశక్తిన్; సదాస్తోత్రత
చ్చటులావామ్నాయ చతుర్ముఖామలును సంశ్లాఘించుటల్లేగదా;
పటుపాథోధిని మగ్నరేణుకుకర వ్యత్యాసముల్ గణ్యమే. 11

మ. కృపకుం బాత్రుఁడుగాఁడు నిన్నొగడు శక్తిప్రాప్తిమన్నాఁడు; స్తో
త్యపరిశాంతినిఁబట్టి జాలిఁగొననౌ నంతేసుమీనీకు, మం
దపుబుద్ధిం గలవాఁడనౌట నుతికన్నన్ దత్పరిశ్రాంతియే
యెపుడున్ జుల్కనచూపెఃగాన, నుచితం బే నాకునియ్యత్నమున్ 12

ఉ. నవిధిఁగల్గ నేర్చు మొదలింభువనంబులు నీకటాక్షమీ
శా విభవంబులేక యెట్టుగల్గుఁబ్రవృత్తి సమస్తజంతులన్
బ్రోవ, నిసర్గ సౌహృదముఁబూని, యిటుల్ చరియించు నీయెడన్
దేవ! శ్రీతాళివత్సలత తేజరిలంగనుఁ జిత్రమెట్లగున్. 13

మ. పరనారాయణ! యుత్తమాన వధికస్వాభావికైశత్వమున్
వరవేదార్థ విమంశవంబు సహియింపంబోఁడు నీయందు; నీ
శ్వర! యుష్మన్మహిమార్ణవాంతరలు తద్వార్బిందువుల్గా రశం
కర, వేధః, పరమస్వరా, ట్సృతమఖ ఖ్యాతామర శ్రేణియున్. 14

చ. నుతనవపుండరీక నయనుండనః, డెవ్వఁడు భాగ్యరాశిశ్రీ
సతికి, నెవండొగిన్ బరమసత్వసమాశ్రియుఁ, డేఁడుపూరుషో
న్నతుఁడు, సదాయుతాయుత శతైకకళాంశక సూక్ష్మభాగభా
సిత మొనరించునేఁడు, చిరచిత్ప్రవిభాగ విచిత్రవిశ్వమున్. 15

చ. స్థితిహారణంబునుం గురుశిరోదళనంబును, దైత్యపీడమొక్
మృతగతి నిట్టియాపదలఁదృంచి, మహాత్మ ఫలప్రదాతయై,

సత, మజరుద్రక్షణకుఁ జాలె నెసందు: మతేవపితుృనం
ఘ్రితల జలంబుమాళ్లిని ధరించి శివుండయియొప్పె రుదుృఁడుగా. 16

ఉ. ఎవ్వనిబొజ్జలోనిమిడె నీశవిరించి ముఖప్రపంచకం
బెవ్వని రక్షణంబునను; మఱెవ్వని బొడ్డునఁ బుట్టె; విశ్వముల్
నెవ్వడినాక్రమించి కబళించి బహిర్గతముం బొనర్చుఁదా
నెవ్వడు, నీవకావె? పరుఁడింకఁ గలండను శంకశక్యమే? 17

చ. అమలినశీలరూప చరితాదులచేఁ బరమప్రకృష్ట స
త్త్వమహిమ, సాత్త్విక ప్రబలతాత్త్విక శాస్త్రములన్, బరాత్పరా
దిమ పరమార్థసంవిదుల దివ్యమతంబుల, నాసురస్వభా
వముగలవారికిన్ నినులవంబును గుఱ్ఱుఁగంగశక్యమే? 18

చ. చిరపరిలంఘి తత్త్రివిధసీమసమాధిక భావనంబునన్
దిరముగఁ గీర్తికెక్కు భవదీయ పరబ్రహ్మస్వభావ మీ
శ్వర! బలవద్భవత్ప్రకృతి సంతతగోపితమయ్యె, నోయభం
గుర! త్వదనన్యభావులగు కొందఱకున్ గననయ్యెడిన్ జుమీ. 19

రయనజాండ గోళముఁ దదంతర గోచరముల్, దశోత్త రా
ములున్, గుణత్రయము, ప్రాణిసమూహముల్, ప్రధానముల్,
పదంబు, దివ్యశుభమంగళ విగ్రహాళులయున్, బరా
యివియెల్లయు మ్మదవితర్క్యవిభూతులుగా నెచూడఁగన్. 20

సులభుండ, వంచిత సుశీలుఁడ, వార్జవసౌమ్య మార్దవ
డవు, స్థైర్యశౌచ మధురత్వకృతిత్వ కృతజ్ఞతావదా
తలకుఁ బట్టుఁగొమ్మవు, దయాళుఁడవున్ సహజంబుగా లస
తత సమస్త, సద్గుణసుధాజలరాశివిగావె యెన్నఁగన్. 21

ప్రణుతామ్నాయముల జ సంభవులపై పైఁబూరుష శ్రీకి నా
య్యనఁదేమోశతనిత్యసుకృతములచే నంసందుఁగల్పించి, క్ర

న్నన, నేఁకైక భవద్గుణావధినిఁబొందంగోరి యున్నట్టి చో
టనెయుండెన్ : మఱితాముపక్రమణవాటంజాలవయ్యెంజుమీ. 22

క. భువనోదయసంస్థితిలయ । భవమోక్షాదికములకు భవచ్ఛ్రితలీలల్
భవదీయగభీరమనో । జ్ఞవిధానుసరణములగునువై దికవిధులున్. 3

చ. నమసు, నమస్సుభాషితమనంబులకందఁగరానినీకి వే
మనసు, నమస్సుభాషితమనంబులకేపొడచూపునీకి వే
నమసు, నమస్సుగై కొనుమ నంతమహిమ్మవిభూతినీకి వే
నమసు, నమస్సుగై కొనుమనంతదయైకపయోధినీకివే. 24

చ. కడుకొని ధర్మనిష్ఠ యెఱుఁగన్; మఱియాత్మవిదుండఁగాను, నీ
లలితపదారవింద యుగళంబున భక్తియొకింత యేనియున్
గలుగ; దకించనుండః నటుగావున, దీనశరణ్య, నేనునీ
యడుగులనే, యనన్యగతినై, శరణంబుగ సేవచేసెదన్. 25

ఉ. నిందితకర్మలెన్ని ధరణింగలవన్నియు, వేయిరీతులన్
ముందుగఁజేసిచేసి యఘముల్ తుదిఁబండెడు నట్టివేళ, నా
కెందును దిక్కుగానక, యహీనదయాళు! ముకుంద! యివ్విధిన్
గుందుచునున్నవాడ, నిదిగో భవదీయ పవిత్రసన్నిధిన్. 26

చ. పరఁగననంత సంసరణవార్నిధి మధ్యమునన్ మునుంగుచున్
బొరలెడు నాకునేఁడుగద పొందఁగ నబ్బితివీవుచేరువన్
దరివలెః దేవ! నీకృపకుఁ దద్దయునుత్తమమైనపాత్రి మి
త్తఱినిదిగో లభించెనుగదా! వరదా మఱియేమిచేసెదో 27

చ. వసుధనభూత పూర్వమయి, భావిలభింపఁగఁ బోవుదేనినై
నసకలమున్ సహింతు. మఱినావ్యసనంబు స్వభావసిద్ధమై
యొసఁగునెకా! మతేమనిన, నీశ! పరాభవమాశ్రితాళికిన్
వెసభవదీయ సన్నిధిలభించుట నీకనురూపమేగదా!, 28

చ. వెడలఁగఁ ద్రోచివైచినను, బ్రేమమయిన్ మఱినీపదాబ్జముల్
విడువఁగనో మహేశ! ప్రభవింపదు బుద్ధి యొకింతయేని; బా
ల్గుడిచెడుచంటిబిడ్డఁడు ప్రకోపవశంబునఁ గ్రిందఁ ద్రోయఁగాఁ
బడియును, దల్లికాళ్లు విడువన్ మదినొల్లఁడుగాదె యెన్నఁడున్. 29

చ. భవదమృతస్రవచ్చరణపంకజయుగ్మనివేశితాత్మకి
చ్చవొడమునయ్య యన్యమున? సారమరందకణప్రపూరమై
భవమృదుశారవిందమురవంత లభించిన, నీరుగొబ్బినిన్
దవులమధువ్రతంబు విడదా? మఱిదానిమొగంబుఁ జూచునే. 30

చ. ఇలనెపుడేని, నెప్పగిదినేనియు, నెవ్వనిచేతనైననున్,
గలితభవత్పదంబుల కొకానొక మాఱొనరింపఁబడ్డయం
జలి, యపుడే హరించు యనిశంబశుభంబుల శేషమున్, సుఖం
బులనొడఁగూర్చు: నెక్కుడుపుడుఁ బోదుగదా వృథయై జగత్పతీ. 31

[ము, లస

క. భవదంఘ్ర్యరుణాంబుజయుగ ప్రవిమలభక్త్యమృతసింధువాఃకణ
ద్భవదావాగ్నిన్, దురిటినార్తి, విరాజత్పరమసౌఖ్యవృత్తినొసంగున్ 32

కం. లీలాక్రాంతవరావర జాలాలయమై, శ్రితార్తిసంక్షయకరమై
క్రాలుమదక్షము, త్వత్పదపాళిసరోజములఁ, గన్గవన్, గనుటెపుడో 33

చ. లలితరథాంగ, శంఖ, కమల, ధ్వజ, కల్పమహీరుహాం, కుశో
జ్జ్వలతరవజ్ర, లాంఛిత భవచ్చరణాంబురుహద్వయంబు శో
భిలుచు మదీయమూర్ధముఁ, ద్రివిక్రమదేవ! యలంకరింపఁగాఁ
గలుగుట యెన్నఁడో గద! సుఖంబులభించుట యెన్నఁడో గదా. 34

చ. ధృతమహనీయహేమమయ దివ్యమహోజ్జ్వలపీతచేలు, సం
స్మృత మృదులాతసీకుసుమమేచక నిర్మలకాంతిపూర చా




రుతను, నిమగ్ననాభివివరుఁ, గనుమధ్యము, నిమ్నతుం....
లతరవిరాజమాన శుభలక్షణలక్షిత శోభ్యురస్థలుఁ. 35

మ. అలఘు జ్యాకిణకర్కశాంచితములై, యాజానులంబంబులై,
లలనాచారువతంసితోత్పల శ్రీవోలంకార సంస్రస్తశో
భ్యలకాబంధ విమర్దశంసకములై, యత్యంతకళ్యాణమం
జులమైనట్టి చతుర్భుజార్గళముల్ సొంపైన మేన్వానినిఁ. 36

కం. అతితుంగదృఢాంసవిలం| బితకుండలభ్రమరకాళిమేదురకంబూ
ర్జితకంధరు,ముఖకాంతివి| జితనిర్మలపూర్ణవిధుఁ శేశయురుచిరుఁ 37

చ. దళితవినూత్నచారుతర తామరస ప్రతిమానలోచనుఁ
వెలయుసముజ్జ్వలాధరు, నవిభ్రమభ్రూలతికావిలాసునిఁ
గలితశుచిస్మితుఁ, మృదుళగండకభాగు, నుదగ్రనాసునిఁ
లలితలలాటికా ఫలకలంబితచంచల సుందరాలకుఁ 38

పంచచామరము. కనత్కిరీటహారకంఠికామణీంద్రకాంచికా
గుణాచ్ఛనూపురాంగదాళిగుంభితుఁ,లసద్గదా
ధనూరథాంగశంఖఖడ్గధారు,నై జయంతికా
వినూత్ననాగమాతృకానవీనవాసనోజ్జ్వలుఁ 39

మ. నిలయంబే మెకునీభుజాంతరము, చింతింపంగ నే దేవి వ
ట్టెలునీకుంబ్రియధామమైపరఁగు, నేయిందీవరాక్షికటా
క్షలవాధారములీనమస్తజగముల్, చర్చింపఁ బాథ్ధోది బ
ల్విడిబంధింపఁబడెఁ, మథింపఁబడె, నేనీలావతీలబ్ధికై. 40

క. నిజవైశ్వరూప్యసంపద | నజస్రమనుభూతయయ్య, నభినవగతివిం
తంజలిపి, గుణరూపవిలా | సజుష్టచేష్టలఁ, ద్వదేకసతతోచితమై.

ఉ. మానగునట్టితావకర మారమణీమణితోఁ, బ్రకృష్టవి
జ్ఞానబలైకధాముఁడు, ఫణామణిజాలమయూఖమండలా

నూనవిభ్రాజమానకలితో దరదివ్యనివాసభాసి తుం
డై నయనంతభోగివరునందుపవిష్టుఁడవైతివాతఁడుం 42

క. గృహ, శయ్యా, సన, పాదుక, బహుళచ్ఛత్రో, పధాన, వసనాదులవి
గ్రహభేదగ శేషత, నీస్వహముల్, శేషుఁడనఁ బిల్వఁబడు, సార్ధముగన్

శా. దాసుండై, సఖుఁడై, వితానమయి, యుద్యద్వాహనంబై, ధ్వజం
బై, సింహాసనమై, ఘనవ్యజనమై, యర్థిన్ ద్వదీయాంఘ్రిపా
ళీసమ్మర్దకిణాంక శోభియయి, యోలిన్ వేదరూపోజ్జ్వలుం
డై, సామీప్యముఁ జేరి, యెల్లప్పుడునాగారాతి సేవింపగన్. 44

మ. సకలంబైన భవద్విభూతిభరమంచత్త్వత్కృపందాల్చి, తా
వకభుక్తోఝ్ఝిత శేషభోజియగు విష్వక్సేనదిన్విభుండు, మా
నక యెక్కార్యము నెవ్విధంబునను విజ్ఞాపించు, గంభీరతా
చ్ఛకటాక్షంబుల, నట్టికార్య, మటులాజ్ఞాపింతు వీవెయ్యెడన్. 45

మ. శ్రితినై సర్గిక సంహతాఖిల మలక్లేశుల్, త్వదీయానుకూ
లతమప్రేమనిధుల్, త్వదర్హసుకృతుల్, సమ్యగ్గ్రహీతోజ్జ్వలాం
చితతత్త్వపరిచార సాధనములన్ జేదాల్చి, భక్తుల్, యథో
చితరీతిన్, నినుసేవసేయఁగఁ గదన్ జెన్నారు చుందెప్పుడున్ 46

చ. అరయనచింత్య, దివ్య, పరమాద్భుత, శాశ్వత, యౌవన, స్వభా
వరుచిరకాంతిభాగమృతవారినిధిన్, గమలైక భాగ్యమున్
బరమసమర్థు, నాపదనపాయసఖున్, బహుళార్థికోటివి
గ్రహధరణీ జరాజము, సరింతగ భక్తజనైక జీవమున్. 47

మ. పరఁగన్ దేవరవారి నేయనుసరింపంజొచ్చినాఁడన్, నిరం
తరసద్భావమనోరథాంతరప్రశాంతస్వాంతరింగుడనై,
నిరతైకాంతికనిత్యకింకరుఁడనై, నేనిఁక నెన్నండును న
స్తున్ రమాకాంత! సనాథజీవితముచే దోషంబునీ కింతయున్. 48

మ. అవినీతుండను, నిర్దయుఁడ, పాపచిత్తుండ, నిర్లజ్జుఁడన్
వివరింపన్ బురుషోత్తమోత్తమ! యునీనింద్యుండ, నేనేలనన్?
శివ, వేధ, స్సనకాది, యోగివరులున్ జింతింపనత్యంతమున్
దవులౌనీపరిచారికత్వమును బొందంజూతుస్వేచ్ఛాగతిన్. 49

క. అపరాధసహాసనిధిన్, నిపతితుఁడభయదభవజలనిధిఁ, గేనలముం
గృప, నీవానిఁగఁగొను, పరమపురుష శరణాగతుండమతియుగతికుఁడన్

క. అవివేకఘనాంధకకు బ్నిపహము, బహుధావిషాదనిరతవివర్ష
ద్భవదుర్దినమున, నచ్యుత! తవిలిపథముదప్పినాఁడ: దయజూడుమయా

చ. ఎదురనొనర్తునీకునిదె యేనొకవిన్నపమాలకింపు: మి
య్యదియనృతంబుగాదుపరమార్థమెసుమ్ము: మతేమనన్ జగ
ద్విదితయశోవిశాల! యదువీర! ననుందయఁజూడకుంటివే
నిఁ, దమకునింక వేఱుదయనీయుఁడుదుర్లభుఁడీధరిత్రిపై. 52

ఉ. కావుననిన్నినాగఁబతిఁగల్గినవాఁడనుగాను నేనిలన్
నీవుమనన్నినాగ దయనీయుఁడుగల్గినవాఁడవౌదువే?
యీవిధినిర్మితంబయినయెక్కటియన్వయమున్ స్థిరంబుగన్
బావన! చేయివీడకయ, పాలననేయుమిప్రేమమీరఁగన్. 53

క. తనువుననెవ్వఁడనై నను, గుణములనెవ్వండనేనగుదుఁగాక, భవ
ద్వనరుహాంఘ్రిపదయుగళము ననిపుడెయియ్యాత్మ నర్పణంబొనరింతున్

క. ఏనునునా. సర్వము । నోనాథా! నీదెకాదె? యుమ్మద్ధనముం
చేనిజమెఱుఁగుముఁగావున నేనునమర్పింపఁబోవ నేమున్నదిఁకన్. 55

క. అతికృప, దేవా! యీశా! శ్వతభవదీయత్వమున్ బ్రసాదించి తెటుల్
పతమటులనన్యభోగ్యా యతభక్తియు నెసఁగుమా, న్యాయంబుగనాకున్

క. భవదీయదాస్యసుఖమై భవ్వైకరతులింటఁగిమిభవంబైననునా
కవుఁగాతఃమితరగృహములభువనేడ్జన్మము నులేకపోవుతనాకున్.

చ. సరగభవత్స్వరూపముఁ గపారఁగనుంగొనుకోర్కెనుత్తమే
తరమగు భక్తియుక్తులను దారత నెవ్వరు లెక్కసేయః రె
వ్వరి విరహంబు నీకు నిలువన్ క్షణమేని సుదుస్సహంబగున్
ధర, నలవైష్ణవోత్తములు నన్దయఁజూడ ననుగ్రహింపుమా 58

శా. శ్రీతన్వీవర! విన్నపంబిదెః భవచ్ఛ్రీవత్స సంపద్బృహ
ద్ఖ్యాతంబౌ నొడలేని, ప్రాణినిచయంబుం గాని, సర్వేప్సిత
ఖ్యాతోద్యత్సుఖమేని, నాత్మయయినన్, గాకింక నేదైనఁగా
నీ, తాళన్ క్షణమేనదెల్ల శతధా నిర్మూలమైపోవుతన్. 59

చ. అపరిమితా, త్యనా, ద్యపరిహార్య దురంత ఘనాఘకోటికిన్
న్ప్రపదుఁడ హేతువర్తనుడ నేఁగుదురయ్యెను, నోదయాసము
ద్ర! వరమబంధురత్నమ! నిరంతర వత్సలతాపయోనిధే
యెపుడు భవద్గుణాళి స్తుతియించి స్మరించి భయంబుపాసెదన్. 60

ఉ. ఇంతయు నిచ్చలేకయును, నిచ్చగలల్లు రజస్తమోవృత
స్వాంతుఁడనైన నేఁగపట వాక్సరణిన్ స్తుతియించినాఁడన
త్యంతము; నట్టులయ్యు, మఱి తద్వచనంబుల నెంచిదైన, భూ
కాంతుఁడ! యిట్టి నా మది నిఁకన్ గృప నీవ యొనర్పు శిక్షలన్. 61

శా. నీవే తండ్రివి, నీవె తల్లి వనుఁగుం బిడ్డండవీవె, సుహృ
ద్భ్రాతుండీవె, సఖుండవీవె, గురువున్ బ్రాపైన, నీవె యిఁకన్;
నీవాఁడన్, మఱి నీదు భృత్యుఁడను, నిన్నే నమ్మితిన్, భక్తుఁడన్
దేవా! నీ పరిచారకుండ, నయిసన్ నీకే భరంబైతినా. 62

చ. ధర, ఘనకీర్తిశౌచపరతన్, సహజైకభవత్పదాంబుజాం
తరతతి, నిన్నుఁ బాయని యెదన్, గుణపూరుషతత్వ సంస్థితిన్
బరఁగ నెఱింగినట్టి గురువంశమునన్ జనియించి, నేనయో!
శరణద! పాపినై, మనఁగఁజాగితిఁగా! తమమం, దగ్గోగతిన్. 63

మ. శ్రుతిదూరుండ, గృతఘ్నుఁడన్, జలమతిన్, క్షుద్రుండ, దుర్మానసం
హతుఁడన్, వంచకుఁడన్, నృశంసుఁడన, సూయాగ్రస్తచిత్తుండనం
తతపాపిష్ఠుఁడఁ గామలోలుఁడ, నెటుల్ దాఁటన్ గలన్ బారవ!
ర్జితమీదుఃఖపయోధిఁ నీచరణముల్ సేవించుటల్ దప్పెడిన్. 64

చ. ప్రణతుఁడటంచు దాదృగపరాధి, రఘూత్తమ!, కాకమున్, గృపన్
గనుటఁ దలంచినన్, నరనభా! ప్రతిజన్మమునందు నెగ్గొన
ర్చిన శిశుపాలుముక్తుఁ గఁ జేసినదెంచిన, ముగ్ధ! యేమిక
ల్గును నీకఁ జెప్ప నీదుష్కృతముకున్ విషయంబులు కానిపాపముల్? 65

శా. సేసినాఁడనెయంచు, నొక్కమరుగానీ. వేఁడు నివ్వాఁడువి
న్నాణంబొప్పఁగఁ దత్ప్రపన్నుఁడు, ప్రతిజ్ఞాసంస్మృతివ్యాపృతా
నూన స్వాంతుఁడవై ననీకు దయనీయుండౌను: సీయీవ్రతం
బోనాథా! ననునొక్కఁడిన్ విడిచి యేమోచెప్పమా శాకిఁకన్, 66

కం. త్వదకృతిమచరణాంబుజ! సదానురాగాంతసీమ సతతాత్మవిదున్
మదినాథమునిఁ బితామహు నీఁ దలచి దయఁ జూడు సైఁచి నేరములు
[ననున్.

మ. వనజాతాంఘ్రినిషేవణుండఁ గనకాంబా కృష్ణమాచార్యనం
దనుఁడన్, గాశ్యపగోత్రి గొట్టుముకలవిద్వద్వంశ్యుఁడన్, మంగళా
ద్రినివాసుండను, నాంధ్రహూణకవితాదివ్యద్వమాకాంతనా
మనుతుండన్, దెలిగించినాఁడ వెలయింపన్ యామునస్తోత్రమున్. 68

(సంపూర్ణము).

